# థ ద్వావింశో%ధ్యాయః

# వీరభద్రుడు దేవతలతో యుద్ధమును చేయుట

వాయురువాచ |

తస్మిన్నవసరే వ్యోమ్ని సమావిరభవద్రథః |
సహస్రసూర్యసంకాశశ్చారుచీరవృషధ్వజః || 1

అశ్వరత్నయోదారో రథచక్రచతుష్టయః | సంచితానేకదివ్యాస్త్ర శస్త్ర
రత్నపరిష్కృతః || 2

తస్యాపి రథవర్యస్యాసీత్స ఏవ హి సారథిః | యశ్చైవ త్రైపురే యుద్ధే
పూర్వం శార్వరథే స్థితః || 3

స తం రథవరం బ్రహ్మ శాసనాదేవ శూలినః | హరేస్సమీపమానీయ
కృతాంజలిరభాషత || 4

భగవాన్ భద్ర భద్రాంగ భగవానిందుభూషణః | ఆజ్ఞాపయతి వీరస్త్వాం
రథమారోఢుమవ్యయః || 5

రైభ్యాశ్రమసమీపస్థస్త్ర్యంబకో%ంబికయా సహ | సంపశ్యతే
మహాబాహో దుస్సహం తే పరాక్రమమ్ || 6

తస్య తద్వచనం శ్రుత్వా స వీరో గణ కుంజరః | ఆరురోహ రథం
దివ్య మనుగృహ్య పితామహమ్ || 7

తథా రథవరే తస్మిన్ స్థితే బ్రహ్మణి సారథౌ | భద్రస్య వవృధే లక్ష్మీ
రుద్రస్యేవ పురద్విషః || 8

తతశ్శంఖవరం దీప్తం పూర్ణచంద్రసమప్రభమ్ | ప్రదధ్మౌ వదనే
కృత్వా భానుకంపో మహాబలః || 9

తస్య శంఖస్య తం నాదం భిన్నసారససన్నిభమ్ | శ్రుత్వా భ##యేన దేవానాం జజ్వాల జఠరానలః || 10

వాయువు ఇట్లు పలికెను -

ఆ సమయములో ఆకాశమునందు వేయి సూర్యుల కాంతి గలది, వృషభము చిహ్నముగా గల అందమైన పతాకము గలది, రెండు శ్రేష్టమైన గుర్రములతో అద్భుతముగా నున్నది, నాలుగు రథచక్రములు గలది, అనేక దివ్యములైన శస్త్రాస్త్రములు గుట్టలు గలది. రత్నములతో అలంకరింప బడినది అగు రథము ఆవిర్భవించెను (1,2), పూర్వము త్రిపురాసురయుద్ధములో శివుని రథముపై ఎవరు సారథిగా కూర్చుండిరో, వారే ఇప్పుడు కూడ ఆ శ్రేష్టమగు రథములో సారథి స్థానములో నుండెను (3). శూలధారియగు శివుని శాసనముచేతనే బ్రహ్మ ఆ గొప్ప రథమును వీరభద్రుని వద్దకు తీసొకొని వచ్చి చేతులను జోడించి ఇట్లు పలికెను (4). ఓ భగవాన్! వీరభద్రా! మంగళకరమగు అవయవమలు గలవాడా! వీరుడ, వినాశము లేనివాడు అగు చంద్రశేఖరభగవానుడు నిన్ను రథమునెక్కుమని ఆదేశించుచున్నాడు (5). ఓ గొప్ప బాహువులు గలవాడా! ఆ ముక్కంటి రైభ్యుని ఆశ్రమమునకు దగ్గరలో జగన్మాతతో గూడి ఉన్నవాడై సహింప శక్యము కాని నీ పరాక్రమమును చక్కగా చూచుచున్నాడు (6). వీరుడగు ఆ గణాధ్యక్షుడు బ్రహ్మయొక్క ఆ మాటలను విని ఆయనను అనుగ్రహించి ఆ దివ్యమగు రథమునధిష్ఠించెను (7). ఆ తీరున సారథిగా గల ఆ శ్రేష్ఠమగు రథములో కూర్చున్న ఆ వీరభద్రుని శోభ త్రిపురాసురసంహారకుడగు రుద్రుని శోభవలె వర్ధిల్లెను (8). తరువాత మహాబలశాలి యగు భానుకంపుడు పూర్ణచంద్రునితో సమానముగా ప్రకాశించే గొప్ప శంఖమును నోటివద్ద నుంచి పూరించెను (9). దగ్గరకు చేరి కూర్చున్న సారసపక్షిని బోలియున్న ఆ శంఖముయొక్క ఆ నాదమును విని దేవతల జఠరములలోని అగ్ని భయముతో నుండెను (10).

యక్షవిద్యాధరాహీంద్రై స్సిద్ధైర్యుద్ధదిదృక్షుభిః | క్షణ న
నబిడీభూతాస్సాకాశవివరా దిశః || 11

తతశ్శార్ఙ్గేణ చాపాంకాత్స నారాయణనీరదః | మహతా బాణవర్షేణ
తుతోద గణగోవృషమ్ || 12

తం దృష్ట్వా విష్ణుమాయాంతం శతధా బాణవర్షిణమ్ | స చాదదే
ధనుర్జైత్రం భద్రో బాణసహస్రముక్ || 13

తమాదాయ చ తద్దివ్యం ధనుస్సమరభైరవమ్ |
శ##నైర్విస్ఫారయామాస మేరుం ధనురివేశ్వరః || 14

తస్య విస్ఫార్యమాణస్య ధనుషో%భూన్మహాస్వనః | తేన స్వనేన
మహతా పృథివీం సమకంపయత్ || 15

తతశ్శరవరం ఘోరం దీప్తమాశీవిషోపమమ్ | జగ్రాహ గణపః
శ్రీమాన్స్వయముగ్రపరాక్రమః || 16

బాణోద్ధారే భుజో హ్యస్య తూణీవదనసంగతః | ప్రత్యదృశ్యత వల్మీకం
వివేక్షురివ పన్నగః || 17

సముద్ధృతః కరే తస్య తత్‌క్షణం రురుచే శరః | మహాభుజంగసందష్టో
యథా బాలభుజంగమః || 18

శ##రేణ ఘనతీవ్రేణ భద్రో రుద్రపరాక్రమః | వివ్యాధ కుపితో గాఢం
లలాటే విష్ణుమవ్యయమ్ || 19

లలాటే%భిహతో విష్ణుః పూర్వమేవావమానితః | చుకోప గణపేంద్రాయ
మృగేంద్రాయేవ గోవృషః || 20

యుద్ధమును చూడగోరే యక్షలతో, విద్యాధరులతో నాగరాజులతో
మరియు సిద్ధులతో క్షణకాలములో దిక్కులయందలి ఆకాశభాగము
మరియు సందులు గొందులు అన్నియు దట్టముగా నిండిపోయెను
(11). అపుడు నారాయణుడు అనే మేఘము తన శార్ఙ్గము అనే

ధనస్సు మధ్యనుండి విడువ బడిన పెద్ద బాణముల వర్షముచే గణములు అనే ఆవుల మరియు ఎద్దుల మందను ముంచెత్తి పీడించెను (12). వందల సంఖ్యలో బాణములను వర్షిస్తూ వచ్చుచున్న ఆ విష్ణువును చూచి ఆ వీరభద్రుడు జయమును కలిగించే తన ధనస్సును స్వీకరించి వేల సంఖ్యలో బాణములను వర్షించెను (13). అతడు యుద్ధమునందు శత్రువులకు భయమును కలిగించే ఆ దివ్యధనస్సును తీసుకొని, ఈశ్వరుడు మేరుపర్వతమును ధనస్సుగా చేసుకొని దానిని టంకారము (నారిత్రాడును లాగి విడిచి పెట్టుట) చేసిన విధముగా, మెల్లగా టంకారము చేయజొచ్చెను (14). ఆ ధనస్సును టంకారము చేయుచుండగా పెద్ద ధ్వని బయలు దేరెను. ఆ పెద్ద ధ్వనిచే భూమి కంపించెను (15). శోభాయుక్తుడు, భయంకరమగు పరాక్రమము గలవాడు అగు ఆ గణాధ్యక్షుడు నాగుపామును బోలియున్న భయంకరముగా ప్రకాశించే శ్రేష్ఠమగు బాణమును చేతిలోనికి తీసుకొనెను (16). బాణమును చేతిలోనికి తీసుకొనుటకై అంబుల పొదిలోనికి చొరబడిన వీరభద్రుని భుజము కలుగులోనికి చొరబడ గోరుచున్న పాము వలె కానవచ్చెను (17). అతని చేతిలోనికి తీసుకొనబడిన బాణము అదే క్షణములో పెద్ద పాముచే కరవబడిన చిన్న పామువలె ప్రకాశించెను (18). భయంకరమగు పరాక్రమము గల వీరభద్రుడు కోపించి బరువైన వాడి బాణముతో వినాశము లేని విష్ణువును లలాటమునందు గట్టిగా కొట్టెను (19). పూర్వములో అవమానింపబడియున్న విష్ణువు ఇప్పుడు లలాటమునందు కొట్టబడినవాడై, సింహముపై కోపించిన వృషభమువలె, ఆ గణాధ్యక్షునిపై కోపించెను (20).

తతస్త్వశనికల్పేన క్రూరస్యేన మహేషుణా | వివ్యాధ గణరాజస్య భుజే భుజగసన్నిభే || 21

సో%పి తస్య భుజే భూయస్సూర్యాయుతసమప్రభమ్ | విససర్జశరం వేగాద్వీరభద్రో మహాబలః || 22

స చ విష్ణుః పునర్భద్రం భద్రో విష్ణుం తథాపునః | స చ తం స చ తం విప్రాశ్శరైస్తావనుజఘ్నతుః || 23

తయోః పరస్పరం వేగాచ్ఛరానాశు విముంచతోః | ద్వయోస్సమభవద్యుద్ధం తుములం రోమహర్షణమ్ || 24

తద్దృష్ట్వా తుములం యుద్ధం తయోరేవ పరస్పరమ్ | హాహాకారో మహానాసీదాకాశే ఖేచరేరితః || 25

తతస్త్వనలతుండేన శ##రేణాదిత్యవర్చసా | వివ్యాధ సుదృఢం భద్రో విష్ణోర్మహతి వక్షసి || 26

స తు తీవ్రప్రపాతేన శ##రేణ దృఢమాహతః | మహతీం రుజమాసాద్య నిపపాత విమోహితః || 27

పునః క్షణాదివోత్థాయ లబ్ధసంజ్ఞస్తదా హరిః | సర్వాణ్యపి చ దివ్యాస్త్రాణ్యథైనం ప్రత్యవాసృజత్ || 28

స చ విష్ణుధనుర్ముక్తాన్ సర్వాన్ శర్వచమూపతిః | సహసా వారయామాస ఘోరైః ప్రతిశ##రైశ్శరాన్ || 29

తరువాత విష్ణువు వాడికొన గల పిడుగువంటి పెద్ద బాణముతో ఆ గణాధ్యక్షుని పామువంటి భుజమునందు కొట్టెను (21). మహాబలుడగు ఆ వీరభద్రుడు కూడ పదివేల సూర్యులతో సమానమగు కాంతి గల బాణముతో మరల వేగముగా ఆ విష్ణువు యొక్క భుజమునందు కొట్టెను (22). ఓ బ్రాహ్మణులారా! ఆ విష్ణువు మరల వీరభద్రుని, అదే విధముగా వీరభద్రుడు మరల విష్ణువును, ఈ విధముగా వారిద్దరు ఒకరినొకరు బాణములతో కొట్టుకొనిరి (23). ఒకరిపైనొకరు వేగముగా శీఘ్రముగా బాణములను ప్రయోగించుచున్న వారద్దరికి శరీరములో గగుర్పాటును కలిగించే సంకులయుద్ధము కొనసాగెను (24). వారిద్దరు ఒకరితోనొకరు ఈ విధముగా ద్వంద్వయుద్ధమును సంకులముగా చేయుచుండగా, ఆకాశమునందు దేవతలు మొదలగు వారు బిగ్గరగా హాహాకారములను చేసిరి (25)

తరువాత వీరభద్రుడు విష్ణువుయొక్క విశాలమగు వక్షఃస్థలమునందు కొననుండి నిప్పులను గ్రక్కే, సూర్యుని వలె ప్రకాశించే బాణముతో చాల గట్టిగా కొట్టెను (26). మహావేగముతో వచ్చి కొట్టిన ఆ బాణముచే గట్టిగా పీడింపబడిన ఆ విష్ణువు తీవ్రమగు నొప్పిని పొంది మూర్ఛిల్లి క్రింద పడెను (27). అపుడు అస్త్రములను అన్నింటినీ ప్రయోగించెను (28 ). శివుని సేనలకు అధ్యక్షుడగు ఆ వీరభద్రుడు కూడ విష్ణువుయొక్క ధనుస్సునుండి విడువబడిన బాణములనన్నింటినీ భయంకరమగు ఎదురు బాణములతో వెంటనే వారించెను (29).

తతో విష్ణుస్స్వనామాంకం బాణమవ్యాహతం క్వచిత్ | ససర్జ
క్రోధరక్తాక్షస్తముద్ధిశ్య గణ   శ్వరమ్ |

తం బాణం బాణవర్షేణ భద్రో భద్రాహ్వయేన తు || 30

అప్రాస్తమేవ భగవాన్ చిచ్ఛేద శతధా పథి | అథైకేనేషుణా శార్ఙ్గం
ద్వాభ్యాం పక్షౌ గరుత్మతః || 31

నిమేషాదేవ చిచ్ఛేద తదద్భుతమివాభవత్ | తతో
యోగబలాద్విష్ణుర్దేహాద్దేవాన్ సుదారుణాన్ || 32

శంఖచక్రగదాహస్తాన్ విససర్జ సహస్రశః | సర్వాంస్తాన్ క్షణమాత్రేణ
త్రైపురానివ శంకరః || 33

నిర్దదాహ మహాబాహూర్నేత్రసృష్టేన వహ్నినా | తతః క్రుద్ధతరో
విష్ణుశ్చక్రముద్యమ్య సత్వరః || 34

తస్మిన్ వీరే సముత్స్రష్టుం తదానీముద్యతో%భవత్ | తం దృష్ట్వా
చక్రముద్యమ్య పురతస్సముపస్థితమ్ || 35

స్మయన్నివ సముత్స్రష్టుం న విష్ణురభవత్ క్షమః |
శ్వసన్నివైకముద్ధృత్య బాహుం చక్రసమన్వితమ్ || 36

ఇచ్ఛన్నపి సముత్స్రష్టుం న విష్ణురభవత్ క్షమః |
శ్వసన్నివైకముద్ధృత్య బాహుం చక్రసమన్వితమ్ || 37

అతిష్ఠదలసో భూత్వా పాషాణమివ నిశ్చలః | విశరీరో యథా జీవో
విశృంగో వా యథా వృషః || 38

విదంష్ట్రశ్చ యథా సింహస్తథా విష్ణురవస్థితః | తం దృష్ట్వా
దుర్దశాపన్నం విష్ణుమింద్రాదయస్సురాః |

సమున్నద్ధా గణ ంద్రేణ మృగేంద్రేణ వ గోవృషాః || 39

ప్రగృహీతాయుధా యోద్ధుం క్రుద్ధాస్సముపతస్థిరే | తాన్ దృష్ట్వా
సమరే భద్రః క్షుద్రానివ హరిర్మృగాన్ || 40

తరువాత కోపముతో ఎరుపెక్కిన కన్నులు గల విష్ణువు తన పేరు చెక్కబడియున్నది, ఎక్కడనైననూ ఇంతవరకు వ్యర్థము కానిది అగు బాణమును ఆ గణాధ్యక్షుని ఉద్దేశించి ప్రయోగించెను. వీరభద్ర భగవానుడు భద్రనామముతో చిహ్నితములైన బాణములను వర్షముగా కురిపించి ఆ బాణము తన వరకు వచ్చుటకు ముందే మార్గమునందు వంద ముక్కలుగా విరుగగొట్టెను. తరువాత, ఆయన ఒక బాణముతో శార్ఙ్గధనస్సును, రెండు బాణములతో గరుత్మంతుని రెక్కలను క్షణకాలములోననే నరికెను. అది అత్యద్భుత దృశ్యము ఆయెను. తరువాత విష్ణువు యోగబలముచే తన దేహమునుండి మిక్కిలి భయంకరాకారులు, చేతులలో శంఖమును చక్రమును గదను ధరించినవారు అగు దేవతలను వేల సంఖ్యలో సృష్టించెను. శంకరుడు త్రిపురాసురులను వలె గొప్ప బాహువులు గల వీరభద్రుడు తన కంటినుండి పుట్టిన అగ్నితో వారి నందరినీ క్షణకాలంలో మాత్రమే పూర్తిగా దహించివేసెను. తరువాత విష్ణువు మరింత కోపించి వేగముగా చక్రమును పైకెత్తి అపుడా వీరునిపై ప్రయోగించుటకు సంసిద్ధుడాయెను. చక్రమును పైకెత్తి ఎదురుగా నిలబడియున్న ఆ విష్ణువును గాంచి, ఆ గణాధ్యక్షుడు చిరునవ్వు నవ్వుచున్న వాని వలె ప్రయత్నము లేకుండగనే విష్ణువు స్తంభించునట్లు చేసెను.

స్తంభించబడిన అవయవములు గల విష్ణువు సాటి లేని ఆ భయంకరచక్రముతో ఎక్కడనైననూ కొట్టవలెనని తలపోసి, అట్లు చేయలేకపోయెను. చక్రముతో కూడియున్న ఒక చేతిని పైకి ఎత్తి ఉంచినవాడై విష్ణువు రొప్పుతున్నాడా యన్నట్లు కనబడెను. ఆయన నీరసముగా రాయి వలె కదలిక లేనివాడై నిలబడెను. ఆ విష్ణువు శరీరము లేని జీవుని వలె, కొమ్ములు లేని ఎద్దు వలె, కోరలు లేని సింహము వలె నిలబడి యుండెను. ఈ విధముగా దుర్దశను పొందియున్న ఆ విష్ణువును చూచి ఇంద్రుడు మొదలగు దేవతలు, వృషభములు సింహముతో వలె, గణాధ్యక్షుడగు వీరభద్రునితో పోరునకు తలపడిరి (30, 39). వారు కోపించి అయుధములను చేతబట్టి ముందుకు వచ్చిరి. వీరభద్రుడు ఆ యుద్ధములో వారిని, సింహము చిన్న చిన్న లేళ్లను చూచినట్లు చూచెను (40).

సాక్షాద్రుద్రతనుర్వీరో వరవీరగణావృతః | అట్టహాసేన ఘోరేణ వ్యష్టంభయదనిందితః || 41

తథా శతమఖస్యాపి సవజ్రో దక్షిణః కరః | సిసృక్షోరేవ ఉద్వ్రజం చిత్రీకృత ఇవాభవత్ || 42

అన్యేషామపి సర్వేషాం సరక్తా అపి బాహవః | అలసానామివారంభాస్తాదృశాః ప్రతియాంత్వ్యత || 43

ఏవం భగవతా తేన వ్యాహతాశేషవైభవాత్ | అమరాస్సమరే తస్య పురతః స్థాతుమక్షమాః || 44

స్తబ్ధైరవయవైరేవ దుద్రువుర్భయవిహ్వలాః | స్థితిం న చక్రిరే యుద్ధే వీరతేజోభయాకులాః || 45

విద్రుతాంస్త్రి దశాన్ వీరాన్ వీరభద్రో మహాభుజః | వివ్యాధ నిశితైర్బాణైర్మేఘో వర్షైరివాచలాన్ || 46

బహవస్తస్య వీరస్య బాహవః పరిఘోపమాః | శ##సై#్రః చకాశిరే దీపై#్తస్సాగ్నిజ్వాలా ఇవోరగాః || 47

అస్త్ర శస్త్రా ణ్యనేకాని స వీరో విసృజన్ బభౌ | విసృజన్ సర్వభూతాని
యథాదౌ విశ్వసంభవః || 48

యథా రశ్మిభిరాదిత్యః ప్రచ్ఛాదయతి మేదినీమ్ | తథా వీరః క్షణాదేవ
శ##రైః ప్రాచ్ఛాదయద్దిశః || 49

ఖమండలే గణ ంద్రస్య శరాః కనకభూషితాః |
ఉత్పతంతస్తడిద్రూపైరుపమానపదం యయుః || 50

మహాంతస్తే సురగణాన్ మండూకానివ డుండుభాః |
ప్రాణైర్వియోజయామాసుఃపపుశ్చ రుధిరాసవాన్ || 51

సాక్షాత్తుగా రుద్రస్వరూపుడు, శ్రేష్ఠుడు మరియు వీరులు అగు గణములచే చుట్టువారబడి యున్నవాడు, దోషములు లేనివాడు అగు ఆ వీరుడు భయంకరమగు అట్టహాసమును చేసి వారిని స్తంభింపజేసెను (41). అదే విధముగా ఇంద్రుడు కుడి చేతిలో వజ్రమును పట్టుకొని దానిని ప్రయోగించుటకు సంసిద్ధుడగుచండగనే, చిత్రపటమునందలి బొమ్మవలె కదలిక లేనివాడై నిలబడెను (42). ఇంతేగాక, ఇతరులందరి చేతులు రక్తమాంసములు కలవియే అయిననూ, సోమరి పోతుల కార్యక్రమముల వలె, కదలిక లేనివి ఆయెను (43). ఈ విధముగా ఆ వీరభద్ర భగవానునిచే కొట్టివేయబడిన సమస్తవైభవములు గలవారగుటచే దేవతలు యుద్ధమునందు ఆయన యెదుట నిలబడలేకపోయిరి (44). వారు భయముతో కంగారు పడి స్తంభించియున్న అవయవములతోనే పరుగిడిరి; వీరుని తేజస్సునకు భయపడి కంగారుతో వారు యుద్ధమునందు నలిబడ లేదు (45). గొప్ప భుజములు గల వీరభద్రుడు పారపోవుచున్న వీరులగు దేవతలను వాడి బాణములతో, మేఘము పర్వతములను వర్షజలములతో వలె, కొట్టెను (46). ఆ వీరుని పరిఘలవంటి అనేకములగు అస్త్రములను, శస్త్రములను విడిచి పెడుతూ సృష్ట్యాదియందు సకలప్రాణులను సృజించుచున్న బ్రహ్మవలె ప్రకాశించెను (48). సూర్యుడు భూమిని కిరణములతో కప్పివేయు

విధముగా, వీరభద్రుడు కేవలము క్షణకాలములో దిక్కులను బాణములతో కప్పివేసెను (49). బంగారముతో అలంకరింపబడిన వీరభద్రుని బాణములు ఆకాశమండలంలో ఎగురుచున్నవై మెరుపులను బోలియుండెను (50). ఆ గొప్ప బాణములు, నీటిపాములు కప్పలను వలె, దేవతాగణముల ప్రాణములనపహరించి, వారి రక్తము అనే ఆసవమును త్రాగెను (51).

నికృత్తబాహవః కేచిత్కే చిల్లూనవరాననాః | పార్శ్వే విదారితాః కేచిన్నిపేతురమరా భువి || 52

విశిఖోన్మథితైర్గాత్రై ర్బాహుభిశ్ఛిన్నసంధిభిః | వివృత్తనయనాః కేచిన్ని పేతుర్భూతలే మృతాః |

గాం ప్రవేష్టుమివేచ్ఛంతః ఖం గంతుమివ లిప్సవః || 53

అలబ్ధాత్మనిరోధానాం వ్యలీయంతః పరస్పరమ్ | భూమౌకేచిత్ప్ర వివిశుః పర్వతానాం గుహాః పరే || 54

అపరే జగ్మురాకాశం పరే చ వివిశుర్జలమ్ | తథా సంభిన్నసర్వాంగైస్స వీరస్త్రి దశైర్బభౌ || 55

పరిగ్రస్తప్రజావర్గో భగవానివ భైరవః | దగ్ధత్రిపురసంప్యూహస్త్రి పురారిర్యథాభవత్ || 56

ఏవం దేవబలం సర్వం దీనం బీభత్సదర్శనమ్ |
గణ శ్వరసముత్పన్నం కృపణం వపురాదదే || 57

తదా త్రిదశవీరాణామసృక్సలిలవాహినీ | ప్రావర్తత నదీ ఘోరా ప్రాణినాం భయశంసినీ || 58

రుధిరేణ పరిక్లిన్నా యజ్ఞభూమిస్తదా బభౌ | రక్తార్ద్ర వసనా శ్యామా హతశుంభేవ కౌశికీ || 59

తస్మిన్ మహతి సంవృత్తే సమరే భృశదారుణ | భ##యేనేవ పరిత్రస్తా ప్రచచాల వసుంధరా || 60

మహోర్మికలిలావర్తశ్చుక్షుభే చ మహోదధిః | పేతుశ్చోల్కా మహోత్పాతాశ్శాఖాశ్చ ముముచుర్ద్రు మాః || 61

అప్రసన్నా దిశస్సర్వాః పవనశ్చాశివో వవౌ | అహో విధివిపర్యాసస్త్వశ్వమేధోయమధ్వరః |

యజమానస్స్వయం దక్షో బ్రహ్మపుత్రః ప్రజాపతిః || 62

కొందరి చేతులు తెగినవి. కొందరి అందమగు ముఖములు చీలిపోయినవి. కొందరు దేవతలు చీల్చబడిన ప్రక్క భాగములు కలవారై నేల గూలిరి (52). బాణములచే పొడిచి వేయ బడిన అవయవములు, తెగకొట్టబడిన బాహువులు కీళ్లు గల అనేకులు నేల గూలిరి, కొందరు పెరికి వేయబడిన కన్నులు గలవారై మరణించి నేల గూలిరి. కొందరు భూమి లోనికి చొచ్చుకు పోవ గోరుచున్నవారు వలె, మరికొందరు ఆకాశమును స్పృశించ గోరుచున్నవారు వలె నుండిరి (53). ప్రాణములు పోయి ఉండుటచే ఒక దేహము మరియొక దేహమునకు ఆటంకము అగుట లేదు. దేహములు ఒక దానితో మరియొకటి కలిసి యున్నవి. కొందరు భూమియందు ప్రవేశించగా, మరి కొందరు పర్వతగుహలలో దాగిరి (54). కొందరు ఆకాశమునకు ఎగురగా, మరికొందరు జలములో ప్రవేశించిరి. ఆ విధముగా ఆ వీరుడు చీల్చబడిన సర్వావయవములు గల దేవతలతో గూడి ప్రకాశించెను (55). అతడు జనసమూహమును తన గుప్పెటలో పెట్టుకున్న భైరవుని వలె, త్రిపురముల చక్కని వ్యూహమును తగులబెట్టిన శివుని వలె ఉండెను (56). ఈ విధముగా దేవసైన్యము అంతయు దీనముగా, బీభత్సవముగా కానవచ్చెను. ఆ సైన్యము గణాధ్యక్షుడగు వీరభద్రునిచే చేయబడిన దీనమైన రూపమును కలిగి యుండెను (57). అపుడు దేవవీరుల ఘోరమగు రక్తపు నది ప్రాణులకు భయమును సూచించుచున్నదై ప్రవహించెను (58). అపుడు యజ్ఞవాటిక అంతటా రక్తముతో తడిసి, శుంభుని సంహరించి

రక్తముతో తడిసిని వస్త్రముతో నల్లని దేహవర్ణముతో నున్న కౌశిక వలె ప్రకాశించెను (59). మిక్కిలి దారుణమైన ఆ గొప్ప యుద్ధము జరుగుచుండగా, భూమి భయపడుచున్నదా యన్నట్లు కంపించెను (60). సముద్రము పెద్ద తరంగములతో నురగలతో సుడి గుండములతో అల్లకల్లోలముగా నుండెను. పెద్ద ఆపదను సూచిస్తూ ఉల్కలు పడినవి. చెట్లు కొమ్మలను రాల్చినవి (61). దిక్కులు అన్నియు ధూళితో నిండినవి. వాయువు అమంగళకరముగా వీచెను. ఆహా! విధి పరిస్థితిని తారుమారు చేసినది. ఇది అశ్వమేధ యాగము, బ్రహ్మపుత్రుడు, ప్రజాపతి అగు దక్షుడు స్వయముగా యజమానుడు (62).

ధర్మాదయస్సదస్యాశ్చ రక్షితా గరుడధ్వజః | భాగాంశ్చ ప్రతిగృహ్ణంతి సాక్షాదింద్రాదయస్సురాః || 63

తథాపి యజమానస్య యజ్ఞస్య చ సహర్త్విజః | సద్య ఏవ శిరచ్ఛే దస్సాధు సంపద్యతే ఫలమ్ || 64

తస్మాన్నావేదనిర్దిష్టం చేశ్వరబహిష్కృతమ్ | నాసత్పరిగృహీతం చ కర్మ కుర్యాత్క దాచన || 65

కృత్వాపి సుమహత్పుణ్యమిష్ట్వా యజ్ఞశ##తైరపి | న తత్ఫలమవాప్నోతి భక్తిహీనో మహేశ్వరే || 66

కృత్వాపి సుమహత్పాపం భక్త్యా యజతి యశ్శివమ్ | ముచ్యతే పాతకైస్సర్వైర్నాత్ర కార్యా విచారణా || 67

బహునాత్ర కిముక్తేన వృథా దానం వృథా తపః | వృథా యజ్ఞో వృథా హోమశ్శివనిందారతస్యతు || 68

తతస్సనారాయణకాస్సరుద్రాస్సలోకపాలాస్సమరే సురౌఘాః | గణ ంద్రచాపచ్యుతబాణవిద్ధాః ప్రదుద్రువుర్గాఢరుజాభిభూతాః || 69

చేలుః క్వచిత్కేచన శీర్ణకేశాస్స్నేదుః క్వచిత్కేచన దీర్ఘగాత్రాః | పేతుః క్వచిత్కేచన భిన్నవక్త్రా నేశుః క్వచిత్కేచన దేవవీరాః || 70

కేచిచ్చ తత్ర త్రిదశా విపన్నా విస్రస్తవస్త్రా భరణాస్త్రః శస్త్రాః | నిపేతురుద్భాసితదీనముద్రా మదం చ దర్పం చల బలం చ హిత్వా || 71

సముత్పథప్రస్థితమప్రధృష్యో విక్షిప్య దక్షాధ్వరమక్షతాస్త్రః | బభౌ గణ శస్స గణ శ్వరాణాం మధ్యే స్థితస్సింహ ఇవర్షభాణామ్ || 72

ఇతి శ్రీ శివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వఖండే దక్షయజ్ఞం

విధ్వంసవర్ణనం నామ ద్వావింశో%ధ్యాయః (22).

ధర్మడు మొదలగు వారు సభాసదలు. గరుడవాహనుడగు విష్ణువు రక్షకుడు. ఇంద్రుడు మొదలగు దేవతలు ప్రత్యక్షముగా హవిర్భాగములను స్వీకరించు వారు (63). అయినప్పటికీ యజమానునకు, యజ్ఞమునకు, ఋత్విక్కులకు వెంటనే తల నరకబడుట అనే ఫలము అభించు చున్నది. బాగున్నది! (64). కావున, వేదముచే విధింపబడనది, ఈశ్వరునిచే బహిష్కరించబడినది, పాపాత్మలచే స్వీకరించబడినది అగు కర్మను ఏ కాలమునందైననూ చేయరాదు (65). మహాపుణ్యమును చేసిననూ, వందలాది యజ్ఞములను చేసిననూ, మహేశ్వరుని యందు భక్తి లేనివానికి ఆ ఫలము లభించదు (66). మహాపాపమును చేసిననూ, ఎవడైతే భక్తితో శివుని పూజించునో, వాడు సకలపాపములనుండి విముక్తుడగును. ఈ విషయములో శంకకు అవకాశము లేదు (67). అధికప్రసంగమేల? శివుని నిందుచుటయందు ప్రీతి గల వ్యక్తి చేసే దానము, తపస్సు, యజ్ఞము మరియు హెూమము వ్యర్థము (68). తరువాత నారాయణుడు, రుద్రులు, లోకపాలకులు అను వారితో కూడియున్న దేవసంఘములు యుద్ధములో గణాధ్యక్షుడగు వీరభద్రుని ధనస్సునుండి విడువబడిన బాణములచే కొట్టబడినవారై

తీవ్రమగు బాధకు తాళజాలక పారిపోయిరి (69). కొందరు కొన్ని చోట్ల చెల్లాచెదరైన జుట్టు గలవారై వణుకుచుండిరి. పెద్ద దేహములు గల కొందరు కొన్ని చోట్ల కూలబడిరి. చీలిన ముఖములు గల కొందరు కొన్ని చోట్ల పడిపోయిరి. దేవవీరులగు కొందరు కొన్ని చోట్ల మరణించిరి (70). జారిపోయిన వస్త్రములు, ఆభరణములు, అస్త్రములు మరియు శస్త్రములు గల కొందరు దేవతలు అచట గొప్ప ఆపదను పొంది దైన్యముతో నిండిన ముఖకవళికలు కొట్టవచ్చినట్లు కానవచ్చుచుండగా, గర్వమును స్వాభిమానమును బలమును పరిత్యజించి అచట పడియుండిరి (71). పరాజయమునెరుంగని ఆ గణాధ్యక్షుడగు వీరభద్రుడు తప్పు దారిలో ఆరంభ##మైన దక్షయజ్ఞమును మొక్కవోని అస్త్రములతో ధ్వంసము చేసి, ఇతరగణాధ్యక్షుల మధ్యలో వృషభముల మధ్యలోని సింహము వలె ప్రకాశించెను (72).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వఖండలో దక్షయజ్ఞవిధ్వంసమును వర్ణించే ఇరువది రెండవ అధ్యాయము ముగిసినది (22).